# అథ చతుర్వింశో%ధ్యాయః

# కామోపభోగములోని దోషములు

వ్యాస ఉవాచ ।

కుత్సితం యోషిదర్థం యత్సంప్రోక్తం పంచచూడయా । తన్మే బ్రూహి సమాసేన యది తుష్టో%సి మే మునే ।। 1

వ్యాసుడు ఇట్లు పలికెను-

ఓ మునీ! కామోపభోగము నీచమైనది అని పంచచూడ చెప్పిన విషయమును, నీకు నాయందు అనురాగము ఉన్నచో, సంగ్రహముగా చెప్పుడు (1).

సనత్కుమార ఉవాచ ।

స్త్రీణాం స్వభావం వక్ష్యామి శృణు విప్ర యథాతథమ్ । యస్య శ్రవణమాత్రేణ భ##వేద్వైరాగ్యముత్తమమ్ ।। 2

స్త్రియో మూలం హి దోషాణాం లఘుచిత్తాస్సదా మునే । తదాసక్తిర్న కర్తవ్యా మోక్షేప్సుభిరతంద్రితైః ।। 3

అత్రాప్యుదాహరంతీమమితిహాసం పురాతనమ్ । నారదస్య చ సంవాదం పుంశ్చల్యా పంచచూడయా ।। 4

లోకాన్ పరిచరన్ ధీమాన్ దేవర్షిర్నారదః పురా । దదర్శాప్సరసం బాలాం పంచచూడామనుత్తమామ్ ।। 5

పప్రచ్ఛాప్సరసం సుభ్రూం నారదో మునిసత్తమః । సంశయో హృది మే కశ్చిత్తన్మే బ్రూహి సుమధ్యమే ।। 6

ఏవముక్తా తు సా విప్రం ప్రత్యువాచ వరాప్సరా । విషయే సతి వక్ష్యామి సమర్థా మన్యసే%థ మామ్ ।। 7

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఓ విప్రా! దుష్ట స్త్రీ స్వభావమును గురించి ఉన్నది ఉన్నట్లుగా చెప్పెదను. వినుము. దానిని వినినంత మాత్రాన ఉత్తమమగు వైరాగ్యము కలుగును (2). ఓ మునీ! చపలచిత్తము గల స్త్రీలు సర్వకాలములలో దోషములకు మూలము అగుచుందురు. ముముక్షువులు జాగరూకులై వారియందు ఆసక్తి లేని వారై ఉండవలెను (3). ఈ సందర్భములో పూర్వము జరిగిన ఇతిహాసమును, దానిలో దుష్టురాలగు పంచచూడతో నారదునకు జరిగిన సంభాషణమును పెద్దలు ఉదహరించుచుందురు (4). బుద్ధిశాలి, దేవర్షి అగు నారదుడు పూర్వము లోకములను తిరుగుచూ సాటిలేని యువతి అగు పంచచూడ అనే అప్సరసను చూచెను (5). నాదరమహర్షి సుందరియగు ఆ అప్సరసతో 'ఓ సుందరీ! నా మనస్సులో ఒక సందేహము గలదు ; దానిని నీవు తీర్చుము' అని పలికెను (6). ఆ సుందరియగు అప్సరస ఆ బ్రాహ్మణునకు ఇట్లు బదులిడెను : నేను చెప్పగలనని నీవు తలంచినచో, అది నాకు తెలిసిన విషయమైనచో, చెప్పగలను (7).

నారద ఉవాచ|

న త్వామవిషయే భ##ద్రే నియోక్ష్యామి కథంచన | స్త్రీణాం స్వభావమిచ్ఛామి త్వత్తః శ్రోతుం సుమధ్యమే || 8

నారదుడు ఇట్లు పలికెను-

ఓ సుందరీ! నేను నీకు తెలియని విషయమును చెప్పుమని నిన్ను ఇబ్బంది పెట్టే ప్రసక్తి లేదు. నేను నీనుండి స్త్రీ స్వభావమును గురించి వినగోరుచున్నాను (8).

సనత్కుమార ఉవాచ|

ఏతచ్ఛ్రుత్వా వచస్తస్య దేవర్షేరప్సరోత్తమా | ప్రత్యువాచ మునీశం తం దేవర్షిం మునిసత్తమమ్ || 9

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

అప్సరసలలోశ్రేష్ఠురాలగు ఆమే ఆ దేవర్షియొక్క ఈ మాటను విని, మహర్షులలో శ్రేష్ఠుడగు ఆ దేవర్షికి ఇట్లు బదులిడెను (9).

పంచచూడోవాచ |

మునే శృణు న శక్యాస్త్రీ సతీ వై నిందింతుం స్త్రియా | విదితాస్తే స్త్రియో యాశ్చ యాదృశ్యశ్చ స్వభావతః || 10

న మామర్హసి దేవర్షే నియోక్తుం ప్రశ్నమీదృశమ్ | ఇత్యుక్త్వా సా%భవత్తూష్ణీం పంచచూడాప్సరోవరా || 11

అథ దేవర్షివర్యో హి శ్రుత్వా తద్వాక్యముత్తమమ్ | ప్రత్యువాచ పునస్తాం వై లోకానాం హితకామ్యయా || 12

పంచచూడ ఇట్లు పలికెను-

ఓ మునీ! వినుము. నేను స్త్రీని అయి ఉండి స్త్రీని నిందించుట తగదు. స్త్రీలు ఎటువంటి వారు అను విషయము, వారి స్వభావము నీకు తెలిసినవే (10). ఓ దేవర్షీ! నీవు నన్ను ఇట్టి ప్రశ్నను వేయుట తగదు. అప్సరసలలో శ్రేష్ఠురాలగు ఆ పంచచూడ ఇట్లు పలికి మిన్నకుండెను (11). దేవర్షులలో గొప్పవాడగు నారదుడు ఆమెయొక్క ఉత్తమమగు ఆ మాటను విని లోకములకు హితమును చేయగోరి మరల ఆమెతో నిట్లు పలికెను (12).

నారద ఉవాచ |

మృషావాదే భ##వేద్దోషస్సత్యే దోషో న విద్యతే | ఇతి జానీహి సత్యం త్వం వదాతస్తత్సుమధ్యమే || 13

నారదుడు ఇట్లు పలికెను-

అసత్యమును పలికినచో దోషము సంక్రమించును. సత్యమును పలికినచో, దోషము లేదు. ఓ సుందరీ! నీవీ సత్యమునెరుంగుము. కావున, ఆ విషయమును చెప్పుము (13).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తా సా కృతమతీ రభసా చారుహాసినీ | స్త్రీ దోషాన్ శాశ్వతాన్ సత్యాన్ భాషితుం సంప్రచక్రమే || 14

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

సుందరమగు చిరునవ్వు గల ఆమె నారదుని ఈ మాటను విని, తన మనస్సులో నిశ్చయించుకొని, యథార్థములు మరియు నిత్యములు అగు స్త్రీ దోషములను చెప్పుటకు ఆరంభించెను (14).

పంచచూడోవాచ |

కులీనా నాథవత్యశ్చ రూపవత్యశ్చ యోషితః | మర్యాదాసు న తిష్ఠంతి స దోషః స్త్రీషు నారద || 15

న స్త్రీభ్యః కించిదన్యద్వై పాపీయస్తరమస్తి హి | స్త్రియో మూలం హి పాపానాం తథా త్వమపి వేత్థ హ || 16

సమాజ్ఞాతానర్థవతః ప్రతిరూపాన్ యథేప్సితాన్ | పతీనంతరమాసాద్య నాలం నార్యః ప్రతీక్షితుమ్ || 17

అసద్ధర్మస్త్వయం స్త్రీణామస్మాకం భవతి ప్రభో | పాపీయసో నరాన్ యద్వై లజ్జాం త్యక్త్వా భజామహే || 18

స్త్రియం చ యః ప్రార్థయతే సన్నికర్షం చ గచ్ఛతి | ఈషచ్చ కురుతే సేవాం తమేవేచ్ఛంతి యోషితః || 19

అనర్థిత్వాన్మనుష్యాణాం భయాత్పతిజనస్య చ | మర్యాదాయామమర్యాదాః స్త్రియస్తిష్ఠంతి భర్తృషు || 20

నాసాం కశ్చిదమాన్యో స్తి నాసాం వయసి నిశ్చయః | సురూపం వా కురూపం వా పుమాంసముపభుంజతే || 21

న భయాదథ వాక్రోశాన్నార్థహేతోః కథంచన | న జ్ఞాతికులసంబంధాత్ స్త్రి యస్తిష్ఠంతి భర్తృషు || 22

ంవనే వర్తమానానామిష్టాభరణవాససామ్ | నారీణాం సై#్వరవృత్తీనాం స్పృహయంతి కులస్త్రియః || 23

యా హి శశ్వద్బహుమతా రక్ష్యంతే దయితాః స్త్రియః | అపి తాస్సంప్రసజ్జంతే కుబ్జాంధజడవామనే || 24

పంగుష్వపి చ దేవర్షే యే చాన్యే కుత్సితా నరాః | స్త్రీణామగమ్యో లోకేషు నాస్తి కశ్చిన్మహామునే || 25

పంచచూడ ఇట్లు పలికెను-

ఓ నారదా! సుందరులగు స్త్రీలు సత్కులమందు జన్మించిననూ, భర్త ఉన్నవారే అయిననూ, మర్యాదను అతిక్రమించినచో, ఆ దోషము వారిదే యగును (15). దుష్టులగు స్త్రీలకంటే ఎక్కువ పాపహేతువు మరియొకటి లేదు. ఇట్టి స్త్రీలు పాపములకు మూలమని నీకు కూడ తెలిసిన విషయమే (16). వారి భర్తలు చదువుకున్నవారు, ధనవంతులు, సుందరులు, మరియు తాము కోరుకున్నవారు అయి ఉన్ననూ, ఈ దుష్టస్త్రీలు అవకాశము లభించినచో తప్పు చేయుటకు వెనుకాడరు (17). ఓ ప్రభూ! మా స్త్రీలకు ఈ తప్పు లక్షణము గలదు. మేము సిగ్గును విడిచి పాపాత్ములగు నరులను సేవించెదము (18). ఎవరైతే వీరిని ప్రార్థించెదరో, దగ్గరకు వచ్చెదరో, కొద్దిగా సేవను చేసెదరో, ఈ స్త్రీలు వారిని కోరెదరు (19). మర్యాదను ఎరుంగని స్త్రీలు కూడ పరపురుషులు కోరి ముందుకు రానప్పుడు, లేదా భర్తయొక్క భయము వలన మర్యాదను అతిక్రమించకుందురు (20). వీరి దృష్టిలో అయోగ్యుడు లేడు. వీరికి వయస్సుతో పని లేదు. వీరు అందగాడైనా కాకపోయినా, పురుషునితో భోగించెదరు (21). ఈ స్త్రీలు భర్తలను అనుసరించి యుండుటకు భయము కాని పెద్దలు కోపబడుట కాని, ధనము కాని, జ్ఞాతులు గాని, వంశసంబంధము గాని కారణము కానే కాదు (22). ్ఠవనములో నుండి అభీష్టములగు ఆభరణములను మరియు వస్త్రములను ధరించి యథేచ్ఛగా సంచరించే స్త్రీలను చూచి కులస్త్రీలు ఆ జీవితమును కోరెదరు (23). దుష్టులగు స్త్రీలను గౌరవించిననూ, ప్రేమతో రక్షించిననూ, వారు గూనివారు, గుడ్డివారు, మందబుద్ధులు మరియు మరుగుజ్జు వారు, కుంటివారు మరియు ఇతరములగు

అవలక్షణములు గల పురుషుల వెంట కూడ బడెదరు. ఓ దేవర్షీ! ఈ స్త్రీలు కామించరాని పురుషుడు ముల్లోకములలో ఒక్కడైనసూ, లేడు (24, 25).

యది పుంసాం గతిర్బ్రహ్మన్ కథంచిన్నోపపద్యతే | అప్యన్యోన్యం ప్రవర్తంతే న చ తిష్ఠంతి భర్తృషు || 26

అలాభాత్పురుషాణాం చ భయాత్పరిజనస్య చ | వధబంధభయాచ్చైవ తా భగ్నాశా హి యోషితః || 27

చలస్వభావదుశ్చేష్టా దుర్గ్రాహ్యా భవతస్తథా | ప్రాజ్ఞస్య పురుషస్యేహ యథా రతిపరిగ్రహాత్ || 28

నాగ్నిస్తుష్యతి కాష్ఠానాం నాపగానాం మహోదధిః | నాంతకస్సర్వభూతానాం న పుంసాం వామలోచనాః || 29

ఇదమన్యచ్చ దేవర్షే రహస్యం సర్వయోషితామ్ | దృష్ట్వైవ పురుషం సద్యో యోనిః ప్రక్లిద్యతే స్త్రియః || 30

సుస్నాతం పురుషం దృష్ట్వా సుగంధం మలవర్జితమ్ | యోనిః ప్రక్లిద్యతే స్త్రీణాం దృతేః పాత్రాదివోదకమ్ || 31

కాయానామపి దాతారం కర్తారం మానసాంత్వయో ః | రక్షితారం న మృష్యంతి భర్తారం పరమం స్త్రియః || 32

న కామభోగాత్పరమాన్నాలంకారార్థసంచయాత్ | తథా హితం న మన్యంతే యథా రతిపరిగ్రహాత్ || 33

అంతకశ్శమనో మృత్యుః పాతాలం వడవాముఖమ్ | క్షురధారా విషం సర్పో వహ్నిరిత్యేకతః స్త్రియః || 34

యతశ్చ భూతాని మహాంతి పంచ యతశ్చ లోకో విహితో విధాత్రా |

యతః పుమాంసః ప్రమదాశ్చ నిర్మితాస్సదైవ దోషః ప్రమదాసు నారద || 35

ఓ బ్రహ్మజ్ఞానీ ! ఈ దుష్టస్త్రీలకు పురుషసంయోగము లభించని సందర్భములలో వారు అన్యోన్యము రమించుటకైననూ వెనుకాడరు. వీరియందు భర్తను అనుసరించి ఉండే లక్షణము లేదు (26). ఆ స్త్రీలు పురుషసంయోగము లేనప్పుడు, కేవలము సేవకులకు భయపడి, లేదా కారాగారశిక్షకు మరణశిక్షకు భయపడి తమకు పరపురుషుల యందు గల ఆశను వదులు కొనెదరు (27). వీరు యథేచ్ఛగా సంభోగమునందు ప్రవర్తించుటచే చంచలస్వభావము మరియు దుశ్చేష్టలు గలవారై యుందురు. వారి స్వరూపము నీవంటి బుద్ధిశాలురగు పురుషులకు కూడ అంతు పట్టనిదై యుండును (28). ఎన్ని కట్టెలను సమర్పించిననూ అగ్నికి సంతోషము ఉండదు. ఎన్ని నదులు వచ్చి కలిసిననూ, సముద్రమునకు తృప్తి ఉండదు. సర్వప్రాణులను సంహరించిననూ, మృత్యువునకు చాలు అనిపించదు. ఈ స్త్రీలు ఎందరు పురుషులతో రమించిననూ తృప్తిని బడయరు (29). ఓ దేవర్షీ! ఈ దుష్టస్త్రీలు అందరియందు గల రహస్యము ఒకటి గలదు. వీరికి పురుషుని చూడగనే కామవికారము కలుగును (30). మానవుల దేహములు నీటితో నిండిన తోలుతిత్తుల వంటివి. చక్కగా స్నానమును చేయుటచే నిర్మలముగా నున్న , మరియు సుగంధపరిమళమును కలిగియున్న పురుషుని చూచి ఈ స్త్రీలకు కామవికారము కలుగును (31). ప్రాణములనైననూ లెక్క చేయక మానమును రక్షించి కష్టములో ఓదార్చి సర్వమును ఇచ్చే భర్తపై కూడ ఈ దుష్టస్త్రీలు ప్రేమను కలిగియుండరు (32). వీరి దృష్టిలో శ్రేష్ఠమగు అలంకారములకు, సంపదకు కామమును భోగించుట కంటె ఎక్కువ విలువ లేదు (33). మృత్యుదేవత, పాతాళము, బడబాగ్ని, కత్తియొక్క ధార, విషము, పాము మరియు అగ్ని ఒకవైపున, ఇటువంటి దుష్టస్త్రీ మరియొక వైపున ఉన్నచో, ఆమె వలననే హాని అధికము (34). ఓ దేవర్షీ! పంచమహాభూతములు, లోకములు, పురుషులు మరియు స్త్రీలు ఏ కాలములో బ్రహ్మగారిచే నిర్మింపబడినారో, అప్పటినుండియు సర్వకాలములలో ఇట్టి దోషము గల స్త్రీలు ఉండిరి (35).

సనత్కుమార ఉవాచ |

ఇతి శ్రుత్వా వచస్తస్యా నారదస్తుష్టమానసః | తథ్యం మత్వా తతస్తద్వై విరక్తోభూద్ధి తాసు చ || 36

ఇత్యుక్తః స్త్రీస్వభావస్తే పంచచూడోక్త ఆదరాత్ | వైరాగ్యకారణం వ్యాస కిమన్యచ్ఛ్రోతుమర్హసి || 37

ఇతి శ్రీశివమహాపురాణ ఉమాసంహితాయాం దుష్టస్త్రీస్వభావ వర్ణనం నామ చతుర్వింశో%ధ్యాయః (24)

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఆమెయొక్క ఈ మాటలను విని నారదుడు మనస్సులో సంతోషించెను. ఆ వచనమును సత్యమని ఆయన తలచి అట్టి స్త్రీలయందు విరక్తి గలవాడు ఆయెను (36). ఓ వ్యాసా! వైరాగ్యమును కలిగించుట కొరకై పంచచూడచే చెప్పబడిన దుష్టస్త్రీస్వభావమును ఈ విధముగా శ్రద్ధగా నీకు చెప్పితిని. నీవు ఇంకనూ ఏమి వినగోరుచున్నావు? (37)

శ్రీ శివమహాపురాణములో ఉమాసంహితయందు దుష్టస్త్రీస్వభావవర్ణనమనే ఇరువది నాల్గవ అధ్యాయము ముగిసినది (24).